**SRINIVASA BALABHARATI - 90**
***(Children Series)***

**VADIRAJATEERTHULU**

*BY*

***R.RAMAMURTHY SHARMA***

T.T.D.Religious Publications Series No.: 945



First Edition : 2015

Copies :

*Published by*

**Dr. D. SAMBASIVA RAO I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*D.T.P. :*

Editor-in-Chief Office, TTD, Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,Tirupati.

**శ్రీనివాస బాలభారతి - 90**

# వాదిరాజతీర్థులు

రచన
**ఆర్.రామ్మూర్తి శర్మ**



ప్రచురణ
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**
**2015**

## ఆముఖం

చిన్నపిల్లల మనసులు చల్లనైనవి, నిర్మలమైనవి. చక్కగా పెరిగిన పిల్లలు భావిభారత పౌరులై మంచి సభ్యత సంస్కారం పెంచుకొని, తమ కుటుంబానికి, దేశానికి కూడ పేరుప్రతిష్ఠలను సంపాదించి గర్వకారణమౌతారు. మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహాపతివ్రతలు ఎలాంటివారు, వారంత గొప్పవారెలా అయినారనే విషయం, వారికథలు చెపుతూ పిల్లలకు తెలియజేయగలిగితే, వాటి ప్రభావం లేతమనస్సులపైన చక్కని సంస్కారముద్రలను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతగానో ఉపయోగపడతాయి.

ఈ ఉద్దేశ్యంతోనే "శ్రీనివాస బాలభారతి" అనే పుస్తకమాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తోంది. ఇందులో మన భారతదేశంలో అనేక ఆదర్శాలలో ప్రసిద్ధులైన మహాత్ముల చరిత్రలు చిన్న చిన్న వాక్యాలలో చక్కని కథాకథన పద్ధతిలో చెప్పడం జరుగుతుంది. చిన్నారి బాలలు వీటిని బాగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.



కీ.శే.డా॥ ఎస్.బి.రఘునాథాచార్యగారు రూపొందించిన ఈ ప్రణాళికను కొనసాగిస్తూ అదే శీర్షికన చాలా పుస్తకాలను ప్రచురింపజేయటంతోపాటు వాటిని హిందీ, ఆంగ్లం మున్నగు ఇతర భాషల్లోనికి అనువదింపజేస్తున్న ప్రచురణలవిభాగం ముఖ్యసంపాదకులు అభినందనీయులు. ఈ ప్రణాళికలో సహకరించిన రచయితలకు, కళాకారులకు మా ధన్యవాదాలు.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# ఒక్క మాట

చిన్నపిల్లల్లో ధార్మిక జ్ఞానాన్ని కల్గించాలని, బాల్యంలో కల్గిన జ్ఞానం జీవితాంతం వారికి ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ 'శ్రీనివాస బాలభారతి' పథకాన్ని ప్రారంభించింది. దీనికి అప్పట్లో ప్రధాన సంపాదకులుగా ఉండిన ప్రముఖ పండితులు, రచయితలు, మాజీ ఉపకులపతి డా॥యస్.బి.రఘునాథాచార్యులవారు ఈ గ్రంథాలను పరిష్కరించి తీర్చిదిద్దారు. వీరి నేతృత్వంలో కొన్ని వేల ప్రతులను చిన్న పిల్లలకు అందించడం జరిగింది.

మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహా పతివ్రతలు, మహావీరులు భారతీయ సంస్కృతికి చక్కని పునాదులు.వారి జీవిత గాథల్ని సరళ సుందరశైలిలో, అందమైన ముద్రణతో వెలుగులోకి తేవడం జరిగింది. ప్రస్తుతం ఆ పుస్తకాలతో పాటు మరికొన్నింటిని కొత్తగా చేర్చి దేవస్థానం ముద్రించింది. భావి భారత పౌరులైన పిల్లలకు ధార్మిక సాహిత్య పరిచయం కల్గించాలనే సత్సంకల్పంతో తి.తి.దే. వీటిని అందిస్తోంది.

తల్లిదండ్రులే పిల్లలకు ప్రథమ గురువులు. కనుక వారు కూడా ఈ 'శ్రీనివాస బాలభారతి' రచనలను ఆదరించి, పఠించి వాటి ప్రాముఖ్యమును పిల్లలకు తెలియచేసి వారిచేత చదివించాలి. అప్పుడే ఆ బిడ్డలు అందరూ ఆదర్శ వంతులుగా తీర్చిదిద్దబడతారనడంలో సందేహం లేదు. నేటి మొక్కలే రేపటి వృక్షాలు కనుక ఇప్పటినుండి పిల్లలలో నైతికములైన విలువలను, ఆధ్యాత్మిక చింతనను పెద్దలు అలవాటుచేస్తే భవిష్యత్తులో ఉత్తమ పౌరులుగా వెలుగొందుతూ ఆదర్శజీవితం సాగించగలరు. ఆ ఈ సంకల్పానికి ఈ బాలభారతి గ్రంథాలు చేయూతనివ్వగలవని మా విశ్వాసం.

ముఖ్య సంపాదకులు

# వాదిరాజతీర్థులు

## ధర్మసంస్థాపన :

భరతభూమి మహర్షులకు, భాగవతోత్తములకు, సిద్ధపురుషులకు, యోగులకు జన్మనిచ్చిన పవిత్రప్రదేశం. ఈ భూమి అనాదిగా సనాతన ధర్మ సంస్కృతులకు నిలయమై ఉన్నది. ధర్మం నశించి అధర్మం పెచ్చుపెరిగేటప్పుడు భగవంతుడు మహా పురుషులను భూమిపై అవతరింపజేసి, వారిద్వారా ధర్మసంస్థాపనం చేస్తాడు. అలా ధర్మసంస్థాపనకోసం అవతరించిన వారిలో శ్రీవాదిరాజస్వామి ఒకరు.

## వైష్ణవసిద్ధాంత ప్రచారం :

పరమ దయాళువైన శ్రీహరియొక్క ఆజ్ఞమేరకు కలియుగంలో సజ్జనులను కాపాడడానికి దేవతల ప్రార్థనల



ననుసరించి భక్తాగ్రేసరుడైన శ్రీవాయుదేవుడు క్రీ.శ.1238 లో ఆనందతీర్థులుగా జన్మించారు. వారికే పూర్ణప్రజ్ఞులని, మధ్వాచార్యు లని ప్రసిద్ధి. వారు తమ ఎనిమిదవ సంవత్సరంలోనే సన్న్యాసాన్ని స్వీకరించి వైష్ణవ సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. రుక్మిణీదేవిచే పూజింపబడిన శ్రీకృష్ణప్రతిమను ఉడిపి క్షేత్రంలో స్థాపించారు. ఆ శ్రీకృష్ణుని పూజకోసం, తమ సిద్ధాంత ప్రచారం కోసం ఎనిమిదిమంది బాలసన్న్యాసులను నియమించారు. వీరే అష్టమఠాధిపతులుగ ప్రసిద్ధిగాంచారు. శ్రీమధ్వాచార్యుల సోదరుడైన శ్రీవిష్ణుతీర్థులు వారిలో ఒకరు. ఆ పరంపరలో శ్రీ వాగీశతీర్థులనేవారు గొప్ప తపస్సంపన్నులు. వారినుండి సన్న్యాసాన్ని స్వీకరించి మిక్కిలి కీర్తిగాంచిన వారే **'శ్రీవాదిరాజ స్వామి'**.

## లక్షాభరణాలు చేయిస్తా!

వీరి జననరీతియే అత్యంత ఆశ్చర్యకరమైంది. కర్ణాటకరాష్ట్రంలో దక్షిణ కర్ణాటక జిల్లా చాలా ప్రసిద్ధమైంది. ఆ జిల్లాలో "కుంభాసి" సమీపంలో "హూవినకెరె' అనే గ్రామం



ఉంది. అందులో సరస్వతీదేవి రామాచార్య దంపతులు నివసించేవారు. సరస్వతీదేవి మిక్కిలి గుణవంతురాలు. వారికి చాలకాలంవఱకు సంతానం కలుగలేదు. తనకు కుమారుడు పుడితే శ్రీ భూవరాహస్వామికి లక్షాభరణాలను చేయిస్తానని మ్రొక్కుకొన్నది సరస్వతీదేవి. వారు అసలే దరిద్రులు. అందులో ఇటువంటి ప్రార్థన చాలా విచిత్రమైంది.

## ఆ శిశువును నాకివ్వండి!

ఒకప్పుడు ఆ దంపతులు శ్రీవాగీశతీర్థులను చూడటానికి వచ్చారు. శ్రీభూవరాహస్వామి శ్రీవాగీశ తీర్థులకు, ఆ దంపతులకు కూడా స్వప్నంలో కనబడి శుభం కలుగుతుందని సూచించాడు. ఆనందభరితులైన శ్రీవాగీశతీర్థులు ఆ దంపతులకు వారి కోరిక నెరవేరేటట్లు ఫలాలను, మంత్రాక్షతలను ఇచ్చారు. ఆ దంపతులకు శ్రీ భూవరాహస్వామి అనుగ్రహం వల్ల లోకవిఖ్యాతుడైన పుత్రుడు కలుగుతాడని చెప్పారు. కాని తన కోర్కెను తీర్చవలసిందిగా వారిని ఆజ్ఞాపించారు. ఆ దంపతులకు పుట్టే ఆ కుమారుణ్ణే

శ్రీభూవరాహస్వామి సేవకై తన కర్పించవలసిందిగా అడిగారు. తమకు పుత్రసంతానం కలుగగలదనే సంతోషంతో వారు దానికంగీకరించారు. కాని ఇలా ఒప్పుకున్నామే అని బాధపడుతుండే వారు. అప్పుడు శ్రీవాగీశతీర్థులు వారినోదార్చి "ఆ శిశువు మీ ఇంట్లో పుట్టినట్లైతే మీరే ఉంచుకోండి. ఇంటి వెలుపల పుట్టినట్లైతే ఆ బాలుని నాకివ్వండి" అని నియమించి సమాధానపరచారు. దానికాదంపతులు అంగీకరించారు.

## దైవనిర్ణయాన్ని దాటగలమా!

కొన్నాళ్ళకు సరస్వతీదేవి గర్భాన్ని ధరించింది. తొమ్మిదినెలలు నిండగా భార్యను ఇంటినుండి బయటకు వెళ్ళనీయక భర్త రామాచార్యుడు మిక్కిలి జాగ్రత్త వహించాడు. ఒక ద్వాదశి తెల్లవారు జామున రామాచార్యుడు భోజనం చేస్తూండగా అతని ఇంటిముందుండే పొలంలో ఒక ఆవు పచ్చగడ్డి మేస్తున్నది. దానిని బయటకు తోలడానికి సరస్వతీదేవి ఇంటి వెలుపలికి వచ్చింది.



ఆమె ఆ ఆవునుతోలి తిరిగి వస్తూ పొలంలోనే మగశిశువును ప్రసవించింది. దైవనిర్ణయాన్ని దాటడం ఎవరికీ సాధ్యం కాదుగదా! ఈ విషయాన్ని ముందే ఊహించిన శ్రీవాగీశతీర్థులు ఆ శిశువు భూమిపై పడకుండా బంగారు పళ్ళెంలో పడేటట్లు స్త్రీలను పంపి ఏర్పాటుచేశారు.

## బాలుడి అప్పగింత :

శ్రీవాగీశతీర్థులు ఆ శిశువును వాడి తల్లిదండ్రుల కప్పగించి, ఆ శిశువుకు ఐదు సంవత్సరాలు నిండిన తర్వాత తనకు అర్పించవలసిందిగా చెప్పారు. ఆ శిశువు భూవరాహస్వామి అనుగ్రహంవల్ల పుట్టడంతో అతనికి భూవరాహుడనే పేరుపెట్టారు. ఆ శిశువుయొక్క బాల్యక్రీడలను చూసి సంతోషపడిన ఆ తల్లిదండ్రులు ఆ బాలుడికి ఐదవ సంవత్సరంలో 'ఉపనయనం' చేశారు. తర్వాత రామాచార్యుడు తన భార్య సరస్వతీదేవిని ఒప్పించి ఆ బాలుణ్ణి గురువుగారి ఆజ్ఞననుసరించి వారికి అప్పగించాడు.



## కారణజన్ముడు :

భూవరాహుడనే పేరుతో పిలువబడుతూ వీరు ఉత్తమ గురువుల వద్ద వ్యాకరణం, న్యాయ, మీమాంసాది శాస్త్రాల నభ్యసించారు. తరువాత వాగీశతీర్థుల దగ్గర మధ్వాచార్యుల వైష్ణవ సిద్ధాంతాన్ని అభ్యసించారు. ప్రహ్లాదునిలాగా ముందునుంచే విరక్తులు, దైవభక్తులు అయిన భూవరాహులు తమ గురువులను సన్న్యాసాన్నివ్వవలసిందిగా ప్రార్థించారు. ఆ ప్రార్థనవల్ల వారి ఎనిమిదవ సంవత్సరంలోనే ఒక శుభదినంలో శుభముహూర్తాన సన్న్యాసమిచ్చారు. శిష్యుని విద్వత్తు, ప్రతిభ, వాదనలో ప్రతివాదులను జయించే సామర్థ్యాన్ని గమనించిన శ్రీవాగీశతీర్థులు వారికి 'వాదిరాజ తీర్థులు' అని పేరుపెట్టారు. కొడుకు సన్న్యాసి అవుతాడనే విషయం తెలిసి చింతిస్తున్న అతని తల్లిదండ్రులకు "మీరు బాధపడవలసిన అవసరం లేదు. మీకు ఇంకో కొడుకు కలుగుతాడు. భూవరాహుడు కారణజన్ముడు. అతనివల్ల లోకకల్యాణం జరుగుతుంది. మీరు అతని అభ్యుదయాన్నాశించే వారు కాబట్టి అతని శ్రేయస్సును అడ్డగించకండి" అని చెప్పి ఓదార్చారు.



## దిగ్విజయయాత్ర :

అవతారకార్యతత్పరులైన శ్రీవాదిరాజతీర్థులు గురువుల అనుమతి తీసుకొని తీర్థయాత్రానెపంతో వాది దిగ్విజయానికి బయలుదేరారు. తల్లి ఆశీస్సులను పొందడానికి వారి గ్రామానికి వచ్చారు. ఆమె అనుజ్ఞను పొంది పుణ్యక్షేత్రాలను దర్శించి తీర్థాలలో స్నానం చేసి భక్తజనులనుద్ధరిస్తూ వైష్ణవ సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. అనేకమంది శిష్యులను పొందారు.

ఆ యా క్షేత్రాలలో సన్నిహితులైన దేవతలను సందర్శిస్తూ ఉడిపికి వచ్చి శ్రీకృష్ణుని, అనంతేశ్వరుని, చంద్రమౌళీశ్వరుని దర్శించారు. అనంతరం చింతామణి నరసింహస్వామిని దర్శించి సుబ్రహ్మణ్యక్షేత్రానికి వచ్చారు. పశ్చిమ తీర్థయాత్రను ముగించి ఉత్తరదిశకు ప్రయాణం చేయాలని కృష్ణవేణీనదిలో స్నానం చేసి, పండరీపురంలో చేరి, గంగామాతను స్తుతించారు. కాశీవిశ్వనాథుని దర్శించి గయ, ప్రయాగ, మధురల మీదుగా బృందావనానికి వచ్చారు. అక్కడినుంచి బదరీక్షేత్రంచేరి శ్రీనారాయణుని

నమస్కరించారు. శ్రీవేదవ్యాసులను దర్శించి, ఉత్తర తీర్థయాత్రా నంతరం పూరీ, శ్రీశైలం, అహోబిలాది క్షేత్రాలను దర్శించి పంపానదీతీరంలో విరూపాక్షుని సేవించి తిరుపతికి వెళ్ళారు. అటునుంచి కంచి, శ్రీరంగం, రామేశ్వరం మొదలైన దక్షిణక్షేత్రాలను ముగించారు.

తాము తీర్థక్షేత్రాదులను సందర్శించేటపుడు ఆ యా దేవతల నుద్దేశించి స్తోత్రాలు చేశారు. వాటి నన్నింటిని క్రోడీకరించి తీర్థక్షేత్రాలను సందర్శించే సజ్జనులకు సంపూర్ణ యాత్రాఫలం లభించడానికి ఆ గ్రంథానికి **"తీర్థప్రబంధ"** మనే పేరు పెట్టారు.

## శ్రీవ్యాసరాయల దగ్గర శిష్యరికం :

వీరు ప్రౌఢ విద్యాభ్యాసానికై సుప్రసిద్ధులైన వ్యాసరాయల దగ్గరికి వెళ్ళారు. ఈ వ్యాసరాయలు విజయనగర సామ్రాజ్యాధి పతియైన శ్రీకృష్ణదేవరాయల ప్రార్థనననుసరించి విజయ నగరంలోనే అనేకమంది పండితులకు, సన్న్యాసులకు ఉన్నత విద్యను బోధిస్తూఉండేవారు. వారిదగ్గర సుప్రసిద్ధులైన



విజయేంద్రతీర్థులు చదివేవారు. వారితోపాటు శ్రీవాదిరాజ తీర్థులును విద్యనభ్యసించారు. న్యాయసుధ, న్యాయామృతం, తర్కతాండవం, తాత్పర్యచంద్రిక మొదలైన ఉద్గ్రంథాలను చదివారు. గురువుల వాదవైఖరిని అనుసరించారు.

## దేవాలయపునరుద్ధరణ :

విజయనగర సంస్థానాధీశుడైన శ్రీకృష్ణదేవరాయలకు కలిగిన ఆర్థిక సంక్షోభాన్ని నిర్మూలించడానికి త్రేతాయుగపు వాలిగుహలో దైవశక్తితో ప్రవేశించి, అక్కడ ఉన్న ద్రవ్యనిధిని రాయలకు అందజేశారు. విరాగియైన శ్రీవాదిరాజులు ఆ భండారంలో ఉన్న వాలి పూజిత శ్రీవిఠలమూర్తిని, సుగ్రీవ పూజిత శ్రీరామచంద్రుని విగ్రహాలను స్వీకరించారు. కృతజ్ఞులైన శ్రీకృష్ణదేవరాయలు రెండేళ్ళకొకసారి జరిగే శ్రీవాదిరాజుల పర్యాయోత్సవంలో ఉడిపికి వెళ్ళారు. శ్రీవాదిరాజుల ఆదేశానుసారం శ్రీ అనంతేశ్వర, చంద్రమౌళీశ్వర, కృష్ణ దేవాలయాలను పునరుద్ధరించారు.



కృష్ణదేవరాయల తర్వాత విజయనగరాధీశుడైన అచ్యుతరాయలకు వైద్యంతో నయంకాని మహావ్యాధి వచ్చి ఉండటం తెలిసికొని శ్రీవాదిరాజులు మంత్రజలాన్ని ఆ రాజుకిచ్చి ఆ వ్యాధిని పోగొట్టారు. శ్రీవాదిరాజులు అతనిచేత ప్రసంగాభరణ తీర్థులనే బిరుదుతో సన్మానింపబడ్డారు.

## లక్ష్మీశోభనం అనే పాట :

దేశ సంచారం చేసే సమయంలో వారు బసచేసిన ఆ ఊరి జాగీరుదారు ఇంట్లో వివాహం జరుగుతోంది. వివాహసమయంలో పూలదండలో చేరిన ఒక చిన్నపాము పెళ్ళికొడుకును కాటేసింది. అతనక్కడికక్కడే మరణించాడు. దిక్కు తెలియని జాగీరుదారు శ్రీవాదిరాజులను శరణువేడాడు. అప్పుడు లక్ష్మీశోభనమనే పాటను రచించి, పాడి, పెళ్ళికొడుకును బ్రతికించారు. ఈ పాట సకలశాస్త్ర సారభూతమై పురాణార్థ గర్భితమై ఉంది. దీనిని చదివితే ఆయుష్షు పెరుగుతుంది. సకల సౌఖ్యాలు కలుగుతాయి. వివాహాది శుభకార్యాలలో ముత్తయిదువలు ఈ పాటను పాడటం ఆచారంగా ఉంది.



## దుష్టశిక్షణ :

మరొక సమయంలో జాగీరుదారు తనకు సంతానం కలగదని శ్రీవాదిరాజులద్వారా తెలిసికొన్నప్పటికీ మహమ్మదీయ మంత్రవాది ఇచ్చిన మంత్రఫలంతో ఒక కుమారుణ్ణి పొందాడు. అప్పుడు ఆ జాగీరుదారు భార్యాపుత్రులతో కలసి శ్రీవాదిరాజుల దగ్గరికి వెళ్ళి తమ కుమారుణ్ణి ఆశీర్వదించమని ప్రార్థించాడు. జాగీరుదారుయోగ్యతను తెలిసికొన్న శ్రీవాదిరాజులు అతణ్ణి ఉద్ధరించడానికి శంఖోదకాన్ని ఆ బాలుడిపై చల్లారు. వెంటనే ఆ బాలుడు అదృశ్యమయ్యాడు. ఆ బాలుడు తన నిజస్వరూపమైన పిశాచదేహాన్ని పొంది జాగీరుదారును తినడానికి వచ్చాడు. శ్రీవాదిరాజులు మంత్రవాది ఉద్దేశాన్ని అతడికి తెలిపి పిశాచిని మంత్రజలంతో భస్మంచేసి జాగీరుదారును రక్షించారు.

## మోకాళ్ళతో ఎక్కడం :

శ్రీవాదిరాజులు కుంభకోణానికి వెళ్ళి అక్కడి సభలో అనేకమంది పండితులను వాదంలో ఓడించారు. సంచారక్రమంలో

శ్రీవేంకటేశ్వరుని దర్శించాలని వేంకటాచలానికి వచ్చారు. ఆ కొండలో అనేకమంది మహర్షులు తపస్సులో నిమగ్నమై ఉండడాన్ని చూశారు. కాలిబాటను కొండ ఎక్కేటప్పుడు మెట్లలో శ్రీనివాసుని సన్నిధానం తెలిసిన శ్రీవాదిరాజులు పాదాలతో నడవడం తగదని తెలిసికొని మోకాళ్ళు మోచేతులతో పాకి కొండనెక్కి శ్రీ శ్రీనివాసుని దివ్య సందర్శనం చేసుకున్నారు. సాలిగ్రామాలను సమర్పించి భక్తితో స్తుతించారు.

## క్షమాభిక్ష :

భీమరథీనదీతీరంలో శ్రీవాదిరాజులు ఉండగా మఠం వస్తువులను దొంగలించడానికి కొంతమంది దుండగులు ఆశ్రమంపై దాడిచేశారు. దాంతో పరివారమంతా భయంతో శ్రీవాదిరాజులు చిరునవ్వుతో నిర్భయంగా కూర్చుని ఉన్నారు. వారిని చూస్తూనే వారి మహిమవల్ల మనఃపరివర్తనం చెందిన దొంగలు తమ పనికి పశ్చాత్తాపం చెంది మమ్మల్ని క్షమించమని యతివర్యులను శరణువేడారు.



## బంగారు శనగలు :

శ్రీవాదిరాజులు పండరీపురంలో ఉన్నప్పుడు తెల్లగుఱ్ఱ మొకటి ఒక పొలంలో ప్రవేశించి శనగలను తినసాగింది. ఆ పొలం యజమాని ఆ గుఱ్ఱాన్ని తరుముకొంటూ వచ్చాడు. అంత ఆ గుఱ్ఱం శ్రీవాదిరాజులుండే స్థలానికి వచ్చి అదృశ్య మయ్యింది. శ్రీవాదిరాజులు ఆ గుఱ్ఱం హయగ్రీవుడు కాక వేరెవ్వరూ కారన్న సత్యాన్ని తెలిసికొన్నారు. ఆ గుఱ్ఱం మేసినంతవరకు పండిన శనగలు బంగారు శనగలుగా మారుతాయని శ్రీవాదిరాజులు ఆ పొలం యజమానికి చెప్పారు. వీరు చెప్పినట్లే ఆ పొలంలో బంగారు శనగలను చూసి ఆ యజమాని పొలాన్నే మఠానికి సమర్పించాడు.

## కవికులతిలక :

పూనాలో ఉన్న రాజు మాఘకవి రచించిన "శిశుపాల వధ" అనే కావ్యాన్నే మిక్కిలి శ్రేష్ఠమైన కావ్యంగా పరిగణించి దానిని ఏనుగుపై అంబారీవేయించి ఊరేగించాలని తలచాడు.



ఈ విషయాన్ని తెలిసికొన్న శ్రీవాదిరాజు పంతొమ్మిది రోజులలో, **'శ్రీరుక్మిణీశవిజయ'** మనే మహాకావ్యాన్ని రచించి, దాన్ని రాజుదగ్గరికి పంపారు. రచనారీతిని, వర్ణనానైపుణ్యాన్ని, శైలిని, చమత్కారాలను చూసి ఆశ్చర్యచకితుడైన రాజు ఆ కావ్యాన్నే 'సర్వోత్కృష్టకావ్యంగా' పరిగణించి ఏనుగుపై ఊరేగించాడు. శ్రీ వాదిరాజులకు **"కవికులతిలక"** అనే బిరుదునిచ్చి సన్మానించాడు. ఈ కావ్యంలో శ్రీకృష్ణుని లీలలు అత్యద్భుతంగా వర్ణింపబడ్డాయి. ద్వాపరయుగంలో రుక్మిణీదేవి పంపగా శ్రీకృష్ణుని దగ్గరికి సందేశాన్ని తీసుకువెళ్ళిన బ్రాహ్మణోత్తముడే కలియుగంలో శ్రీవాదిరాజులుగ అవతరించడమే దీనికి మూలకారణం.

## రాజపుత్రుని రక్షించడం :

ఒకప్పుడు శ్రీవాదిరాజులు ఢిల్లీలో సమాధిచేయబడ్డ రాజకుమారుని దేహాన్ని తీయించి తీర్థాన్ని అతనిపై చల్లారు. వెంటనే ఆ రాజకుమారుడు నిద్రలేచినట్లు లేచి కూర్చున్నాడు. పుత్రశోకాన్ని తీర్చిన శ్రీవాదిరాజులకు ఆ ముస్లిముల రాజు వందలకొద్ది



ఒంటెలతో బంగారు నాణాల నిచ్చి సత్కరించాడు. కాని వైరాగ్య శిఖామణులైన శ్రీవాదిరాజులు వాటిని స్వీకరించక గంగానదిలో పడవేయించారు.

## లక్షాలంకార రచన :

శ్రీవాదిరాజులు కాశీనుంచి బ్రహ్మావర్తం, ప్రయాగక్షేత్రాలకు వెళ్ళినపుడు శ్రీవేదవ్యాసులు ప్రత్యక్షమై పుత్రప్రాప్తి కోసం నీ తల్లి మ్రొక్కిన లక్షాభరణాలకు బదులు లక్షగ్రంథాత్మకమైన భారతంలోని కఠిన భాగాలకర్థాన్ని రచించి, తల్లి కోరికను తీర్చమని ఆజ్ఞాపించారు. వారి ఆజ్ఞననుసరించి శ్రీవాదిరాజులు లక్షాలంకార మనే గ్రంథాన్ని రచించి శ్రీవేదవ్యాసుల కర్పించి తల్లి మ్రొక్కు తీర్చారు.

## మధ్వాష్టక రచన :

శ్రీవాదిరాజులు తీర్థయాత్రలు చేస్తూ పుణ్యక్షేత్రమైన ద్వారావతిని చేరారు. అక్కడ ఉపవాసం చేస్తూ ఆరు నెలలు తపస్సు

చేశారు. ఆ సమయంలో అక్కడనే జ్వరంతో బాధపడుతున్న "కృష్ణ" అనే యతుల ప్రార్థన ననుసరించి 'శ్రీమధ్వాష్టకం' రచించి, వారి కుపదేశించి, వారి జ్వరాన్ని పోగొట్టారు. ద్వారావతిలోని ఒక గుహలో ఉన్న శ్రీ హయగ్రీవ సాలిగ్రామాన్ని తెచ్చి పూజించమని శ్రీవాదిరాజులకు స్వప్నంలో సూచన జరిగింది. ఆ సూచన ననుసరించి శ్రీవాదిరాజులు ఆ హయగ్రీవ సాలిగ్రామాన్ని తెచ్చి పూజించారు.

## లోభి ఉదారుడయ్యాడు :

స్వభావంతో యోగ్యుడైన శ్రీవైష్ణవ బ్రాహ్మణ ధనికుడు పరమలోభిగా ఉండేవాడు. అతని ననుగ్రహించడానికి శ్రీవాదిరాజులు తన దగ్గర ఉన్న మరొక హయగ్రీవ సాలిగ్రామాన్ని అతనికిచ్చి నేను వచ్చేవఱకు దీనిని పూజించమని ఆజ్ఞాపించి వెళ్ళారు. అప్పటినుంచి అతడు భక్తితో హయగ్రీవుని పూజించి ఉదార హృదయుడయ్యాడు. శ్రీవాదిరాజులు కొద్దికాలం తర్వాత అతని దగ్గరికి వచ్చారు. శ్రీ హయగ్రీవుని దయతో ఆ ధనికుడు



లోభరహితుడై తన ధనాన్నంతా సత్కార్యాలకు వినియోగించి, భగవద్భక్తుడై ఉండటం గ్రహించి శ్రీవాదిరాజులు శ్రీ హయగ్రీవ సాలిగ్రామాన్ని వెనుకకు తీసుకున్నారు. ఆ ధనికుడే శ్రీవాదిరాజులనుగ్రహంతో 'వైకుంఠదాసు'డని ప్రసిద్ధిచెందాడు.

శ్రీవాదిరాజులు గుజరాత్ మొదలైన దేశాలలో సంచరించి అనేకమంది ప్రతివాదులను వాదంతో ఓడించారు. సత్పురుషులకు తత్త్వజ్ఞానోపదేశం చేసి వైష్ణవసిద్ధాంతాన్ని ప్రచారం చేశారు.

## విఠలుడుగా మారిన విగ్రహం :

ఒకప్పుడు శ్రీవాదిరాజులు మూడబిదరె అనే గ్రామానికి వెళ్ళారు. జైనమతావలంబియైన అక్కడి రాజు శ్రీవాదిరాజులను నవరత్నమయ విగ్రహాలను చూడటానికి జైన ఆలయానికి ఆహ్వానించాడు. శ్రీవాదిరాజులు తానక్కడికి వస్తే ఆ విగ్రహాలు వైష్ణవదేవతామూర్తుల్లాగా మారతాయని ఆ రాజుకు తెలిపారు. అయినప్పటికీ రాజు వచ్చి తీరాల్సిందేనని పట్టుబద్దాడు.



శ్రీవాదిరాజులు దేవాలయానికి వెళ్లి అక్కడి తొమ్మిది విగ్రహాలను చూశారు. వాటిలో ఒక ఆకుపచ్చ ప్రతిమ సర్వలక్షణయుక్తమై ఉంది. శ్రీవాదిరాజులు ఆ ప్రతిమలో శ్రీవిఠలస్వామిని ధ్యానించారు. వెంటనే ఆ విగ్రహం విఠలుని ఆకారం దాల్చింది. ఆనందపరవశుడైన ఆ రాజు ఆ మూర్తిని శ్రీవాదిరాజులకు సమర్పించాడు.

## ధర్మస్థలాభివృద్ధి :

భూతాలయమైన ధర్మస్థలానికి శ్రీవాదిరాజులు ప్రార్థితులై వచ్చి ఆ ప్రదేశాన్ని పవిత్రీకరించారు. శ్రీ భూతరాజును సేవకునిగా పొందిన శ్రీ గురువర్యులు వారిచేత మంజునాథస్వామిని తెప్పించి ధర్మస్థలంలో ప్రతిష్ఠించి, ఆ లింగ శిరస్సుపై శ్రీనరసింహ సాలిగ్రామాన్నుంచి పూజించారు. అప్పటినుంచి ఆ క్షేత్రంలో ధర్మం అభివృద్ధి అయ్యేటట్లు, అన్నదానాదులు నిరంతరం జరిగే ఏర్పాట్లు చేసి, ఆ క్షేత్ర ప్రసిద్ధికి కారకులయ్యారు.




**భూతరాజు**

కుమారధార, వేత్రావతీనదుల సంగమ స్థలంలో 'కటిశివాలయ' మనే సుందర ప్రదేశం ఉంది. ఆ స్థలంలో తఱచుగా శివలింగాలు ఉద్భవిస్తూఉండేవి. అలా వేయి లింగాలుద్భవించాయి. ఆ లింగాలు ఎత్తైన స్థలంలో ఉండటంతో అభిషేకం చేయడానికి నీరు తేవడం అసాధ్యమయ్యేది. శ్రీవాదిరాజులు ఆ క్షేత్రాన్ని దర్శించి దగ్గరలో నున్న చెఱువునుంచి శివలింగాలున్న ప్రదేశానికి దండంతో ఒక గీత గీశారు. వెంటనే ఆ చెఱువులోని నీళ్ళు ఈ గీత ద్వారా శివలింగాలున్న ప్రదేశానికి చేరాయి. ఈ విధంగా శ్రీవాదిరాజులు తమ తపోబలంతో ఆ శివలింగాలకు సదా అభిషేకాదులు జరిగేటట్లు ఏర్పాటుచేశారు. అప్పటినుంచి ఆ స్థలాన్ని 'దండతీర్థ' మని వ్యవహరిస్తున్నారు.

## విగ్రహ ప్రతిష్ఠలు :

శ్రీ వాదిరాజులు తమ దిగ్విజయయాత్ర సమయంలో అయోధ్యానగర ద్వారంలో ఉన్న శ్రీఆంజనేయ, శ్రీ గరుడ ప్రతిమలను తెచ్చి ఉడిపిలో ఉన్న శ్రీకృష్ణదేవాలయంలో వాయవ్య,



నైరుతిదిశలలో ప్రతిష్ఠించారు. శ్రీకృష్ణదేవాలయ ఉత్తరద్వారంలో శ్రీమధ్వప్రతిమను ప్రతిష్ఠించారు. ఉత్తర దిక్కులలో నాగప్రతిష్ఠ చేయించారు.

## ఏకాదశీవ్రతం :

శ్రీ వాదిరాజులు ఒక ఏకాదశిరోజున దేవుని అలంకరించి, ధ్యానంలో మునిగారు. మరుసటిరోజు ద్వాదశి ప్రాతః కాలంలో ధ్యానం ముగించి స్నానాదికాలు పూర్తిచేసి ద్వాదశీ పూజలు నిర్వహించారు. అప్పటినుంచి ఏకాదశీరోజు అలంకరించి అర్చనాదులు చేస్తారే కాని ధూప–దీప–హారతీ ఇత్యాదిసేవలను చేయరు.

## రోజూ కైలాసానికి :

ఒక మాంత్రికుడు తన మాయావిద్యతో ఆకాశంలో కొంతకాలముండి మళ్ళీ క్రిందకు దిగివస్తూండేవాడు. ఇతని ఇంద్రజాల విద్యకు మోసపోయిన శ్రీసోదే క్షేత్రపాలకుడైన అరసప్పనాయకుడు ప్రధానశిష్యుడయ్యాడు. తన గురువులు



ప్రతిరోజు కైలాసానికి వెళ్ళివస్తున్నారని నమ్మాడు. అతని కోరికననుసరించి బ్రాహ్మణులను అతని మతాన్ని స్వీకరించమని బలాత్కరించేవాడు.

## శరణు శరణు :

ఒకానొకప్పుడు శత్రురాజులు దండెత్తి అరసప్పనాయకుణ్ణి ఓడించగా, అతడు తన పరివారంతో అడవిలో తలదాచుకున్నాడు. అప్పుడు అక్కడే ఉన్న శ్రీవాదిరాజులను చూసి శరణు శరణన్నాడు. సజ్జనుల ప్రాణఘాతకుడైన అతణ్ణి క్షమించకూడదని మొదట తలచినా స్వభావంతో యోగ్యుడని భావించి, క్షమించి, మంత్రాక్షతలనిచ్చి ఆశీర్వదించాడు. శ్రీవాదిరాజుల తపోబలం వల్ల ఆ రాజు తిరిగి వెళ్ళేటప్పుడు అతని వెనుక శంఖచక్రాది పంచాయుధాలు ధరించిన సైనికులు, తెల్లని గుఱ్ఱాల నెక్కి గుంపులుగా రావడం చూసి శత్రురాజులు పారిపోయారు.



## గుట్టు బయటపడింది :

ఆనందభరితుడైన ఆ రాజు శ్రీగురువర్యులను భక్తిశ్రద్ధలతో పూజించి వారి దాసానుదాసుడయ్యాడు. రాజు ప్రార్థించగా శ్రీవాదిరాజులు రాజసభకు వచ్చారు. అప్పుడు శ్రీవాదిరాజుల కోరిక మేరకు ఆ రాజు మాంత్రికుణ్ణి సభకు రప్పించి, కైలాసానికి వెళ్ళి రావడాన్ని తాను తమ గురువులు చూడాలని చెప్పాడు. మామూలుగా ఆకాశమార్గంలో వెళ్తున్న మాంత్రికుణ్ణి వాదిరాజ శిష్యుడైన భూతరాజు క్రిందికి పడేశాడు. క్రిందపడ్డ మాంత్రికుడు తన గుట్టు బయట పడిందని బాధపడ్డాడు. రాజు వెంటనే ఆ మాంత్రికుణ్ణి శిక్షించి, రాజ్యం నుంచి వెడలగొట్టాడు. అప్పటినుంచి విజయసూచకంగా శ్రీవాదిరాజులు దేవుని పూజకు బసవని గంటను ఉపయోగించే ఆనవాయితి ఏర్పడింది.

## దశావతారకీర్తన :

ఒకసారి రాజుయొక్క అల్లుడు అకాలమరణం పొందగా శ్రీగురువర్యులు మాట ఎనిమిది నామములున్న దశావతార కీర్తనతో శ్రీనారాయణుని స్తుతించి బ్రతికించారు.

## హయగ్రీవుడు స్వీకరించిన నైవేద్యం :

'కోటేశ్వరం', 'మట్ట' గ్రామాలలో సజ్జనులున్నారని తెలుసుకున్న శ్రీవాదిరాజులు వాళ్ళకు వైష్ణవదీక్ష నిప్పించి, ఉద్ధరించారు. దీనికొక కథ ఉంది. శ్రీహరి సాక్షాత్తు హయగ్రీవ రూపంతో శ్రీవాదిరాజుల దగ్గరికి వచ్చి వారి శిరస్సుపై పళ్ళెంలో ఉన్న నైవేద్యాన్ని స్వీకరించేవారట. కొంతమంది దుర్మార్గులు శ్రీవాదిరాజుల కీర్తికి కళంకం తేవాలనే దురుద్దేశంతో "దేవుడు సాక్షాత్తుగా కలియుగంలో నైవేద్యాన్ని స్వీకరించాడు. శ్రీవాదిరాజులు తామే తిని హయగ్రీవరూపియైన శ్రీహరి భుజించాడని కపటనాటకంతో జనులను మోసగిస్తున్నారని" నిందించారు. చివరికి వారంతా రహస్యంగా ఒకచోటచేరి భక్ష్యంలో విషం కలిపి నైవేద్యానికి పంపారు. ఆరోజు కూడా హయగ్రీవస్వామి కొంచెమైనా విడవక ప్రసాదమంతా తిన్నారు. కాని ఎదురుగా ఉన్న తెల్లని హయగ్రీవ విగ్రహం నల్లగా మారింది. విషాన్ని కలిపిన జనులు మరణించారు. శ్రీవాదిరాజులు దశావతారస్తుతిని





రచించి నలభైఎనిమిదిరోజులు స్తుతితో హయగ్రీవుని మెప్పించాడు. తరువాత ఆ విగ్రహం మునుపటిలాగే తెల్లగా మారింది. ఈ సంఘటన గుర్తుండటానికి నల్లని రంగు కంఠప్రదేశంలో మాత్రం ఉంది. ఇప్పటికీ వాదిరాజుల సంస్థానంలో ప్రత్యక్షంగా చూడవచ్చు.

సంచార క్రమంలో శ్రీవాదిరాజులు బేలూరు వచ్చినపుడు అక్కడ చెన్నకేశవస్వామికి రథోత్సవం జరుగుతోంది. అక్కడే వైకుంఠదాసులు కూడా నివసించేవారు. మహాత్ములైన శ్రీవాదిరాజులు ఇక కొద్దిసమయంలో ఇక్కడికి రానున్నారని, అంతవరకు వేచివుండాలని వైకుంఠదాసులను దేవస్థానాధికారులను కోరారు. ఆ మాటను అధికారులు వినక ఉత్సవానికి సంసిద్ధులయ్యారు. కాని కొన్ని వేలమంది చేరి రథాన్ని లాగినప్పటికీ రథం జరుగలేదు. ఏనుగులు లాగినా రథం ముందుకు సాగలేదు. దానితో ఆ అధికారులు శ్రీగురువర్యుల సన్నిధికి వచ్చి క్షమించండని ప్రార్థించి ఆహ్వానించారు. శ్రీ గురువర్యులు చాల సంతోషంతో దూరంనుంచే చెన్నకేశవునికి నమస్కరించారు. తరువాత



శ్రీవాదిరాజులు వైకుంఠదాసులు కూడా చేరి రథం త్రాడును లాగగా రథం ముందుకు సాగింది.

## వినాయకుడు హయగ్రీవుడయ్యాడు :

స్వర్ణకారుడొకడు పంచలోహాలతో తన ఇంట్లో వినాయకుని విగ్రహాన్ని తయారుచేయడానికి చాలాసార్లు మూసను తయారుచేయ ప్రయత్నించినప్పటికీ అది వినాయకుని రూపం దాల్చక హయగ్రీవరూపాన్నే దాలుస్తూండేది. ఆశ్చర్యచకితుడైన ఆ స్వర్ణకారుడికి భగవంతుడు స్వప్నంలో దర్శనమిచ్చి మూడవ రోజున అతని దగ్గరికి వచ్చే దివ్యపురుషుడికి ఆ విగ్రహాన్నిచ్చేటట్లు సూచించాడు. శ్రీవాదిరాజులు ఈ విషయాన్నే తన దివ్యదృష్టితో తెలుసుకొన్నారు. అతన్నుంచి ఆ సుందర హయగ్రీవమూర్తిని పొందారు. ఆ హయగ్రీవ మూర్తిని తన సంస్థానంలో శ్రీభూవరాహమూర్తితోపాటు ఉంచి పూజించారు. స్వర్ణకారుడికి వైష్ణవ ధర్మదీక్షనిచ్చారు. అప్పటినుంచి ఆ స్వర్ణకారుని కుటుంబానికి శ్రీహయగ్రీవ దేవుడే కులదేవత అయ్యాడు.

**మృత్తికామహిమ :**

కుష్ఠురోగి ఒకడు శ్రీవాదిరాజుల మృత్తికా లేపనమాత్రంచేత ఆ మహారోగం నుంచి విముక్తి పొందాడు. మహమ్మదీయుడొకడు శ్రీగురువర్యులు పాదమృత్తికాలేపనంతో చాలాకాలంనుంచి ఉన్న తన తలనొప్పిని పోగొట్టుకొని సుఖంగా ఉన్నాడు.

**మూర్ఖుడు పండితుడయ్యాడు :**

పాండిత్యం వల్ల మదాంధుడైన పండితుడొకడు తనకు సాటిలేదని గొప్పలు చెప్పుకుంటూ శ్రీగురువర్యులతో వాదానికి బయలుదేరాడు. శ్రీగురువర్యులు కేవలం మూర్ఖుడైన ఒక శిష్యునిచే ఆ పండితుని ఓడింపజేశారు. ఆ శిష్యుణ్ణి మహాపండితు డయ్యేటట్లాశీర్వదించారు.

**బంగారు వర్షం :**

ఋణపీడితుడైన దరిద్ర బ్రాహ్మణుడొకడు ఋణవిముక్తి కోసం శ్రీవాదిరాజులను ప్రార్థించాడు. శ్రీవాదిరాజులు “యా



సుగంధాస్య నాసాది” అనే శ్రీసూక్తంయొక్క అర్థాన్ని బోధించే స్తోత్రంతో సంపదల కభిమానియైన శ్రీలక్ష్మీదేవిని స్తుతించారు. దానితో బంగారువర్షం కురిసింది. అంతటితో ఆ బ్రాహ్మణుడు ఋణవిముక్తుడయ్యాడు.

**మహిమలు :**

ఒకప్పుడు శ్రీగురువర్యులు తపస్సు చేస్తూండగా ఒక ఘటసర్పం వారిని చుట్టుకొని కాటువేయాలని చాల ప్రయత్నంచేసి చివరికి దాని కోరలు ఊడి నీరసించింది. ఒకానొకరోజు సర్పభయంవల్ల తన దగ్గరకు వచ్చిన ఎలుకను చూసి కరుణచేత ఆ సర్పానికి ఎలుకకు స్నేహం కుదిరేటట్లు చేశారు.

**అంగరక్షకుడిగా పులి :**

శ్రీవాదిరాజులు సుబ్రహ్మణ్యక్షేత్రంలోని కుమార పర్వతాన్నెక్కుతుండగా దారిలో శ్రీగురువర్యులు ఒక దృశ్యాన్ని చూశారు:– ఒక పెద్దపులి అక్కడే మేస్తున్న ఆవుపై లంఘించడానికి



సిద్ధంగా ఉంది. అంతలోనే యతివర్యులు ఆ పెద్దపులి కెదురుగా తన చేతినెత్తి చూపించగానే వెంటనే ఆ పెద్దపులికి ఆవుపై గల వైరభావం పోయి స్నేహభావం కలిగింది. అప్పటినుంచి ఆ పులి గురువర్యులకు అంగరక్షకుడిగా సేవిస్తుండేది. శ్రీగురువర్యులు ఆ పర్వతంలో తపస్సు చేస్తున్న తన మఠం మూలపురుషులైన శ్రీ విష్ణుతీర్థులను చూసి, వారిచ్చిన దేవతావిగ్రహాలను తీసుకొని వచ్చారు.

**రచనలు :**

తాము అవతరించినప్పటినుంచి నూటఇరవై సంవత్సరాలు శ్రీ హయగ్రీవ భూవరాహాది శ్రీహరిరూపాలను అర్చిస్తూ భక్తజనులను అపారమహిమలతో ఉద్ధరిస్తూ అమానుషక్రియలతో ఆశ్చర్యపరుస్తూ అమోఘాలైన అనేక గ్రంథాలను రచించి వైష్ణవసిద్ధాంతాన్ని ప్రచారం చేశారు.

సర్వజ్ఞులైన శ్రీగురువరేణ్యులు వేదాంత శాస్త్రసర్వస్వ విచారాత్మకమైనదీ, యుక్తియుక్తాలైన సిద్ధాంతాలను ప్రతిపాదించే



‘యుక్తిమల్లికా’ అనే అసదృశమైన గ్రంథాన్ని రచించారు. ప్రసిద్ధమైన తాత్పర్యనిర్ణయ టీకా గ్రంథమైన ‘భావప్రకాశం’ మొదలైన టీకాగ్రంథాలను భక్తజనుల నుద్ధరించడానికి రచించారు.

**బ్రాహ్మణుడుగా హరి :**

శ్రీగురువర్యులు నాలుగు ద్వైవార్షిక పర్యాయాలు భగవంతునకు సేవలు చేసి అయిదవ పర్యాయం తమ శిష్యుడైన వేదవేద్య తీర్థులను ఉడిపిలో భగవానునికి సేవచేయడానికి నియోగించారు. తాము సోదే క్షేత్రంలో మురళీధరుడైన శ్రీకృష్ణుని, చంద్రమౌళీశ్వరుని ప్రతిష్ఠించి అత్యంతవైభవంతో ఉత్సవం చేశారు. ఒకప్పుడు ‘ఉడిపి’లో శ్రీవాదిరాజుల పర్యాయోత్సవంలో శ్రీహరియే స్వయంగా బ్రాహ్మణ రూపంతో వచ్చి అనేక సంపదలనిచ్చాడనే ఐతిహ్యం.

**ప్రతిష్ఠలు :**

బదరీక్షేత్రంలో అందమైన రథంలో ఉన్న త్రివిక్రమదేవుని శ్రీభూతరాజు చేత తెప్పించి శాలివాహన శకం 1504 చిత్రభాను

సంవత్సర వైశాఖ పూర్ణిమనాడు సోదేక్షేత్రంలో అత్యంతవైభవంతో ప్రతిష్ఠించారు. సమీపంలోనే ఉన్న లక్ష్మీదేవి విగ్రహాన్ని త్రివిక్రమ దేవుని ముందుభాగంలో ప్రతిష్ఠించారు.

తమ అవతారసమాప్తి కాలంలో సోదేక్షేత్రంలో శ్రీత్రివిక్రమ దేవాలయానికి ఉత్తరదిశలో 'ధవళగంగాసరోవరం' నిర్మించి 'పంచ బృందావనం' స్థాపించారు.

**సజీవసమాధి :**

శాలివాహనశకం 1522 శార్వరీ సంవత్సర ఫాల్గుణ శుద్ధనవమి రోజున అంకురారోపణం చేసి మఱునాటినుంచి చతుర్దశి వరకు పుష్పరథోత్సవాన్ని, పూర్ణిమనుండి మహారథోత్సవాన్ని జరుపుతుండగా శ్రీగురువర్యుల ఇష్టప్రకారం త్రిలోకాధిపతి అయిన దేవేంద్రుడు దివ్యవిమానం పంపాడు. శ్రీవాదిరాజులు ఆ విమానాన్ని అశ్వత్థ వృక్షంపై ఉండేటట్లు ఆజ్ఞాపించి ఉత్సవాలన్నిటినీ ముగించారు. ఫాల్గుణకృష్ణద్వితీయాతిథిలో శ్రీగురువర్యులు



సకలదేవతా సన్నిధియుక్తమైన పంచ బృందావనాలలో మరునాడు అనగా శాలివాహనశకం 1522 (క్రీ.శ. 1600) శార్వరీనామ సంవత్సరం ఫాల్గుణ కృష్ణ తృతీయ బుధవారం స్వాతీ నక్షత్రంలో సజీవులుగా ప్రవేశించారు.

ఆకాశంలో కోటి సూర్యప్రకాశమైన విమానంలో తేజోమూర్తులైన ఛత్ర చామరాదులతో సేవితులైన గురువర్యులను చూసిన భక్తజనులు మమ్మల్ని కాపాడమని మొరపెట్టుకొన్నారు. భక్తానుకంపియైన తపస్వి శ్రేష్ఠులు తమ పాదుకలను, కాషాయ వస్త్రాన్ని క్రిందపడవేసి ఒక అంశతో బృందావనంలో నుండే భక్తులను కాపాడేటట్లు అభయమిచ్చి విమానంలో పైకి వెళ్ళారు. ఇప్పటికీ వారి ఆరాధనా రోజులలో వారి కాషాయ వస్త్రం, పాదుకలను దర్శించవచ్చు.

బృందావనంలో ఉన్న శ్రీవాదిరాజగురుసార్వభౌములు ఇప్పటికీ భక్తాభీష్టప్రదులై ఉండటంవల్ల–





**"కామధేను ర్యథాపూర్వం సర్వాభీష్టఫలప్రదా ।**
**తథా కలౌ వాదిరాజ శ్రీపాదోఽభీష్టదః సతామ్"॥**

– అని స్తుతించబడుతున్నారు. ఏ విధంగా కామధేనువు సర్వాభీష్టాలనిస్తుందో, ఆ విధంగా శ్రీవాదిరాజగురుపాదులు సజ్జనుల కోరికలను తీర్చేవారని దీని భావం.

